# పతిత

(నాటిక)

గొల్లపూడి మారుతీరావు

నవోదయ పబ్లిషర్స్,
ఏలూరు రోడ్డు, విజయవాడ-2.

"నాట్యకళ" పత్రిక జరిపిన నాటిక రచనా పోటీలలో ప్రథమ బహుమతి పొందిన ఉత్తమ నాటిక.

ఆంధ్ర యూనివర్సిటీ స్నాతకోత్సవ సందర్భములో
జరిగిన వైజ్ఞానిక ప్రదర్శనలలో పాల్గొనిన నటవర్గం.

| | | |
|---|---|---|
| 1. | లలితారాణీ : | డి. సాంబమూర్తి |
| 2. | రజనీకాంత్ : | టి. యస్. రామచంద్రమూర్తి |
| 3. | అరుణకుమార్ : | టి. యస్. రామ కృష్ణ |
| 4. | వేణుగోపాల్ : | పి. యల్. నారాయణ |
| 5. | బోయ్ : | జి. నాగేశ్వరరావు |

దర్శకత్వం : శ్రీ యమ్. సత్యనారాయణ.

# పతిత

పాత్రలు: లలితా రాణి
రజనీ కాంత్
అరుణ కుమార్
వేణు గోపాల్
బోయ్

శుభ్రంగా అలంకరించబడిన హోటల్లో నీ గది అది. మధ్యగా టీపాయ్. రెండు పక్కలా కుర్చీలు. కుడివేపు గుమ్మం దగ్గర "Way Out" అని వ్రాసిన బోర్డు. ద్వారానికి Half Sheeted ఉన్నాయి. ఎడమవేపు " Way to Bording " అన్న బోర్డు వుంది. ఎదురుగా—కిటకీలోంచి మెలికలు తిరిగిన రోడ్డు కన్పిస్తోంది.

అప్పుడే తెల్లవారింది—

లలితా రాణి తెర లేచేసరికి ప్రేక్షకులకు ఎదురుగ్గా వున్న సోఫాలో కూర్చుని వుంది - వేణు - ఆమె భర్త - కిటికీ దగ్గర నిలబడి రోడ్డువేపు చూస్తున్నాడు. రాణీ కొత్త తరహాలో అలంకరించుకుని వుంది. నీలిరంగు చీరె, తెల్లటి బ్లౌజు - అందంగా వుంది. చూసేవాళ్ళని వుత్తేజి పర్చేట్టున్న సన్నటి నడుం, గుండె లోతుల్ని చూసే కళ్ళు, మత్తెక్కించే పెదవులు - యివీ ఆమె ఆయుధాలు.

అరుణకుమార్ పక్కనే ఉన్న కుర్చీలో కూచున్నాడు, తెల్లటి సిల్కులాల్చీ, పరాయి వేసుకున్నాడు. సాత్వికంగా.

శ్రీందంగా – చాలా అందంగా వున్నాడు, కళ్ళలో అమాయ కత్వం, గ్రహింపు – త్వరలోనే 'moods' లోకి వచ్చే మనిషి.. సన్నగా, తెల్లగా ఎదుటివాళ్ళని ఆకర్షించేట్టు......

బోయ్ ట్రేలో పొగలు క్రక్కుతున్న కాఫీ తెచ్చి పోయేడు.

తెర లేచేసరికి ముగ్గురూ గుక్క తిప్పుకోకుండా నవ్వు తున్నారు. మొదట లలితారాణీ నవ్వాగుతుంది.

రాణి : చాలా బాగా మాట్లాడతారే మీరు! అయితే ఆనాడు ఎడిటర్ని అలా ఏడిపించారన్నమాట?

అరుణ : మరేం చెయ్యమన్నారు? ఫీజ్ లేవంటే వదలకపోతే- ఏం చేసేది? ఒకటే వేపుకు తినేయడం. ఇక బాధ పడలేక – ఆదివారం యిస్తానని యిలా పారిపోయొ చ్చాను. ఇక్కడ నన్ను 'కుమార్' అని పిలవండి చాలు.

రాణి : మీకథలంటే నాకు చాలా యిష్టం. ముఖ్యంగా మీరు వ్రాసిన "శిల్పసుందరి"

అరుణ : ఓహో! అదా? ఓసారి ఊటీ వెళ్తాంటే కాబోలు ఓఅమ్మాయిని చూశాను నిజానికి నిరాడంబరతలోంచి అందం పుట్టిందా అనిపిస్తుందినాకు. ఒకొక్కప్పుడు అందానికి అర్థంలేదు. ఎప్పుడూ ముఖంమీద చిరు నవ్వు, పణికే పెదాలూ, ముఖ్యంగా ఆ కళ్ళు...... ఎలాగంటే (ఆమెకళ్ళని అనుకోకుండా చూసి ఆగాడు. ఇది గమనించి ఆమె సిగ్గుపడితే) క్షమించండి – ఆ

అందాన్ని మరిచిపోలేక కథలో పొదిగాను. కవి చెయ్యగలిగిందల్లా అదొక్కటి – ఏమంటారు ?

వేణు : (టేబిలు దగ్గరకు వచ్చి కాఫీ చల్లారిపోతుంది. తీసు కుందామా ?–

అరుణ : మెనీ థాంక్స్

రాణి : క్రిందటి సమ్మర్ కి వచ్చినపుడు ఓమంచి పిక్చర్ లో పరిచయ మయింది. యీసారి ఎలాగడుస్తుందా అను కొంటూ వచ్చానిక్కడికి. మీరు కన్పించారు ఏం వేణు ?——

వేణు : (మాటమార్చి) ఈ రోడ్డు ఎంత బాగా మెలికలు తిరి గిందో చూడండి

రాణి : (నవ్వి) పరాకుమనిషి. అదిసరే. యీవాతవరణాన్ని మీరెలా వర్ణిస్తారో చెప్పండి చూదాం.

వేణు : (ఇటుతిరిగి) అంత సులువుగా అయిపోతుందా ? దానికీ మూడ్ కావాలి. "నిరుపహతి స్థలంబు, రమణీ ప్రియ దూతిక తెచ్చియిచ్చుకప్పుర విడెము......

అరుణ : అబ్బే ! అంత అక్కర్లేదు లెండి.

రాణి : ప్రియదూతిక లేకపోయినా ప్రేయసి వుంటే చాలా ! (నవ్వుతుంది.)

అరుణ : నాకింకా పెళ్ళి కాలేదు —— (సిగ్గుపడ్తాడు)

రాణి : సిగ్గుపడడం కూడా తెల్సేమీకు–? ఊ ! ... (నవ్వు తుంది)

వేణు : కష్టాలకి నాంది కాలేదన్నమాట. బ్రతికి పోయేవు.

రాణి : (చిరుకోపంతో) పెళ్ళిచేసుకుని తనేం కష్టాలు పడుతున్నాడో కాస్త అడగండిమీరు.

వేణు : అదిగో నోరెత్తితే చాలు అనుమానం. స్త్రీకి దేవుడు అందం, యౌవనం, యిచ్చాడు బాగానేవుంది. కాని అంతటితో సరిపెట్టి 'మనస్సు' మాత్రం లేకుండా చేస్తే యింకా బాగుండేది. ఏమంటారు?

అరుణ : బాగానే చెప్పారు.

రాణి : సరే యీ వాతావరణాన్ని గురించి...

అరుణ : చెప్తా చూడండి. (లేచి కిటికీదగ్గరకు వెళ్తాడు. కాసేపు అటువేపు చూసి ఎడమవేపు ఉన్న బుద్ధుడి విగ్రహం దగ్గర ఆగుతాడు.) చల్లటిగాలి వీస్తూంటే, కరుకుగా మనే సూర్యుని మొదటికిరణం శరీరాన్ని సోకడం, కుడికన్ను తెరవటం, ఎడమది మూయటం ... ఓ చెయ్యి తలక్రింద, మరొకటి, మరొకటి అలారం కొట్టే వాచీ తలమీద, ఇలా బాధలు పడీ పడి – చివరకు టేబిలుమీద వున్న వెచ్చటి కాఫీ అందుకోవడం – ఇదీ ఇప్పటి అవస్థ – (కాఫీసిప్ చేస్తాడు.)

వేణు : లైట్ హ్యూమర్ మీది.

అరుణ : ఇంతకన్న వెయిట్ యిప్పటి ప్రజలకి అనవసరం. ఇదీ యిప్పటికి నే కనిపెట్టిన విషయం.

(ఓ వ్యక్తి లోనికి వచ్చాడు. చేతిలో సూట్ కేసు. నల్లటికోటు తొడుక్కున్నాడు. కీనైన విగ్రహం. తల కాస్త

నెరిసింది. వయస్సు ముప్పైఅయిదు పయిన, కళ్ళల్లో నైశిత్యం, మాటలో స్పష్టదశ...ఏదో తెలీని గాప్పతనం విగ్రహంలో గోచరిస్తూ ఎదుటవాళ్ళ మనస్సుని ఆకికట్టుతూంటుంది. పేరు రజనీకాంత్.

రజనీ : ఎక్స్క్యూజ్ మీ సర్. ఇదేనా కేఫ్ రాయల్ ?

రాణి : మరొకసారి బయట బోర్డు చూసి లోపలకి రండి. (అనుకోకుండా తొందరపాటులో జవాబిచ్చింది.)

వేణు : ఇదే...

అరుణ : కూచోండి.

రజని : థాంక్స్...(పెట్టెక్రింద వుంది, నుదుటిని తుడుచుకుంటూ కిటికీ దగ్గరకి వెళ్ళి ఆగేడు.)

(క్షణకాలం నిశ్శబ్దం. ఇతనిరాక అక్కడి వాతావరణాన్ని కదిపింది. వాళ్ళంతా నిశ్శబ్దంగా ఉండిపోయేరు ఇది చూసి విస్తుపోయాడు రజని.)

రజని : అంత హఠాత్తుగా ఆగిపోయేరేం ? మాట్లాడండి.

వేణు : దేని విషయం.

రాణి : మన అవస్థని చెప్పాను. ఈ మూడ్ ని ఎలా చెప్తారు మీరు ?

అరుణ: (పరాకుగా రజనీని చూస్తున్నవాడల్లా తేరుకుని) ఏమంటారు ?

రాణి : ఈ మూడ్.....

అరుణ : అది చాలా కష్టమయిన పనే.

వేణు : ఎందుకని ?—

అరుణ: (లేచి కుడివేపు గుమ్మం వరకూ నడిచి ఆగాడు) ఎందుకంటే చెప్పలేను. (రజనీని ఉద్దేశిస్తూ) కాని ఒకరి మూడ్ మరొకరికి బాధాకరంగా ఉండవచ్చు.

రజనీ : (గ్రహించి) నాకేం బాధలేదు చెప్పండి.

రాణి : (విసుగుదలతో) మనం మాట్లాడుకుంటూంటే మధ్య ఆయనకెందుకూ బాధ ? చెప్పండి.

అరుణ: మొదట మీ మూడ్ చెప్పనా ?

రాణి; ఊ...

అరుణ : కోపం రాదుకదా ?

రాణి : అదీఒక మూడేగా ?– (నవ్వి) మరీ అల్లరి పిల్లాడు కాకండి, ఊఁ—

అరుణ ; అయితేసరి – (మెల్లిగా ప్రారంభించాడు) అప్పుడే వికసిస్తున్న కుసుమం మీద అనుకోకుండా పెద్దమంచుబిందువు పడితే వికసించటంపోయి రేకులు నేలని జారినట్టు — యిప్పటి యీ యనరాక మిమ్మల్నిలా క్రిందకు లాగింది—

వేణు : అదేమిటి—

రజని : భేష్ బాగా చెప్పారు!—

అరుణ–కోపం రాలేదా మీకీమాటల్తో ?— (రజనితో అన్నాడు)

రజని : కోపం ఎందుకని ?— నిజమేగా మీకు చెప్తున్నది ? నాకు face Reading బాగా తెల్సు. గుమ్మంలో అడుగు పెడుతూనే అంతా కనిపెట్టగలిగాను.

వేణు : అయితే యిక మనం మాట్లాడడం ఏమంత మంచిది కాదు.

రాణి : ఏం ?

వేణు: ముఖం చూస్తూనే యిన్ని విషయాలు గ్రహించారీయన. ముఖ్యంగా నువ్వు మాట్లాడకూడదు. నీ జీవితంలో ఎన్నో రహస్యాలు – ఏదో తెలీని ప్రళయాలు ఇంకా...

రాణి ; వేణూ ! ఏమిటీ మరీ పిచ్చిమాటలు...

వేణు : నీముఖంమీద కోపం ఎంత విచిత్రంగా వుంటుంది? ఏమంటారు కుమార్ గారు !– కొందరి ముఖాలకు కోపం అతకదు. ఉదాహరణకి – ...

రాణి : అలా మాట్లాడితే నే వెళ్ళి పోతానిక్కడనుంచి...

వేణు : ఎదుటి వాడిని స్వాధీనపర్చుకోవటం ఎలాగో తెల్సు కోవాలంటే రాణిదగ్గర ఆరు నెలలు తరిఫీదు పొందాలి–. (రాణి లేవబోతే) అహఁహఁ– నీకు కోపం తెప్పించి నవ్వుకోవాలని సరదా నాకు. కూచో – మరి మాట్లా డను లే.

రాణి : వేణూది అంతా పిచ్చి. మీరు మాట్లాడరేం కుమార్ గారూ ?

అరుణ: (రజనితో) చూడండి. ఇక్కడి వాతావరణం గురించీ, యిక్కడి వ్యక్తుల గురించి యీమె నన్ను మాట్లాడ

మంటున్నారు. మీకు face Reading తెల్సు
నన్నారుగా ? – మా గురించి కాస్త చెప్తారా ?

రాణి : (స్నిగ్ధంగా) నా గురించి చెప్పనక్కర్లేదు.

అరుణ: మీ కిష్టం లేకపోతే మానేద్దాం.

వేణు : దానికేం. చెప్పండి. నో ఆన్సర్.

రజని : చెప్పమంటారా లలితారాణి.

రాణి : పేరు !

రజని : అదేగా మీది:–ఏమంటారు వేణుగోపాల్ గారూ ?

వేణు : నా పేరుకూడా !

రజని : ఆశ్చర్యపడకండి. ఇవి చాలా చిన్న విషయాలు. ఇంకా మిమ్మల్ని ఆశ్చర్యపరిచే విషయాలు చాలా చెప్తాను.

అరుణ: అదే కావాలి మాకు. కూచోండి. అసలు మిమ్మల్ని చూడగానే అనిపించింది – మీలో ఏదో గొప్పతనం ఉందని.

రజని : (నవ్వి) దానికేం లెండి. మంచి మంచినే ఆకర్షిస్తుంది.

రాణి : (కరకుగా) అయితే మేం మంచివాళ్ళము కామనా మీ ఉద్దేశం.

రజని : అంతలో త్రుళ్ళుపడి బుజాలు తడుముకుంటావే, నేనా మాట అన్నానా !

రాణి : తెలివిగా మాట్లాడ ననుకుంటున్నాడు కాబోలు !

రజని : తెలివి 'మేధకు' సంబంధించిన విషయం. చమత్కారము హృదయానికి సంబంధించిది. Wit and Humour అంటారే ! – అది.

వేణు : సరే అసలు విషయం కదపండి.

రజని : అలాగే (లేచి అటూ ఇటూ కాస్సేపు పచార్లు చేస్తాడు. అంతా ఆయనవేపే చూస్తూంటారు. నడుస్తున్న వాడల్లా ఆగి) చూడండి. face Reading గొప్ప విషయమే. కానీ దైవదత్తమయిన ఓ వ్యక్తి మానసిక తత్త్వాన్ని ముఖంచూసి మాటల్లో చెప్పబూనటం సాహసం. సృష్టికి ప్రతిసృష్టి చెయ్యడమన్న మాట. సర్వశక్తుల్నీ కేంద్రీకరించి ఒకరి గుండె లోతుల్ని తఱచి, కష్టాన్నీ, సుఖాన్నీ కళ్ళముందు పేర్చి చూపడం – యిందులో మంచీ బయటపడుతుంది, చెడూ బయటపడుతుంది – సిద్ధమేనా మీరంతా ?

అరుణ : (తడుముకోకుండా, కుతూహలం ప్రకటిస్తూ) నేను సిద్ధమే.

రజని : (వేణుని) మీరు ?

వేణు : చెప్పండి వింటాను.

రజని : ప్రతి ఒక్కరి అభిప్రాయము తీసుకోవడం మంచిది. సోఫా వెనక్కి వచ్చి) ఏమంటారు రాణీ ?

రాణి : (ఆగి, ఎందుకో తికమక పడి) మీరు మీరు ఆత్మద్రోహం చేసుకుంటున్నానని పించకపోతే చెప్పండి నేనేం భయపడను. (ముఖంకాస్తనల్లబడింది)

రజని : (నవ్వి) మీరలా అనడంలోనే మీకు మీరు ఆత్మ ద్రోహం చేసుకుంటున్నా రన్నమాట. (కోటు మెల్లగా విప్పుతూ) సరే. మొదట మీతోనే ప్రారంభిస్తాను... (ఆమె అతని ముఖాన్ని చూసింది. మళ్ళా ఠీవిగా గర్వంగా నవ్వాడు) నిజానికి చిరచిరలాడే స్వభావం కాదు మీది. ఇప్పుడు ప్రదర్శిస్తున్న కోపమంతా ఏదో రహస్యాన్ని దాచటానికి మీరు చేస్తున్న నటన. క్షమించండి యిలా చెప్తున్నందుకు. మీ హృదయం నిజానికి ఎంత మెత్తటిదంటే అప్పుడే వికసిస్తున్న పువ్వుని చూస్తే ఎంత ముగ్ధులౌతారో, దాని రేకులు రాలడం చూస్తే అంతగా కదలిపోతారు.

రాణి : ఇదేనా మీరు తెలుసుకున్నది ?–

రజని : ఇంకా వుంది. చూడండి. ఇప్పుడు మీరు కోపంగా వున్నారు.

రాణి : చాలా కష్టపడి గ్రహించారు.

అరుణ : ఆయన్ని పూర్తిగా చెప్పనివ్వండి.

రజని : మీలో ఉన్న ఒక్క బలహీనత చెప్తే చాలు – జీవితంలో ఎన్నడూ మర్చిపోలేనంత కృంగిపోతారు.

రాణి : ఇక ఆపండి.

రజని : మీ యిష్టం.

వేణు : చెప్పనీ రాణి ! చాలా ఆశ్చర్యంగా ఉన్నాయి యీయన మాటలు.

రాణి : చదువుకున్న వాళ్ళని పట్టుకునే పిచ్చి.

అరుణ : చెప్పండి.

రజని : ఆమెని 'సరే' అనమనండి.

రాణి : నా మూడ్ ని హఠాత్తుగా మార్చగల నంటారు మీరు?

రజని : నిముషంలో.

రాణి : స్త్రీ హృదయాన్ని తెల్సుకున్న వాళ్ళింతవరకూ లేరు.

రజని : (మాటని తేలిక చేస్తూ నవ్వి) నిజంగా మీకుండవలసిన అహంకారమే అది. ఇంకొకరి దగ్గరయితే పొసగి పోయేది. నా దగ్గర మాత్రం అది సరికాదు.

రాణి : సరే అయితే. చెప్పండి నా బలహీనత ఏమిటి?

రజని : (ఆగి, ఆలోచించి - మెల్లగా కిటికీ దగ్గరకు వచ్చి అటువేపు చూస్తూ నిలబడ్డాడు.) జీవితంలో తప్పించు కోలేని దెబ్బ తగిలింది మీకు - మనస్సుకి -

రాణి : (తడబడి) అబద్ధం.

రజని : కాదు : పూర్తిగా చెప్పనీయండి. ఇప్పటికీ మీరావిష యాన్ని పూర్తిగా మర్చిపోలేక పోతున్నారు. ఎప్పుడూ దగ్గర ఉండే స్నేహితుడు మోసంచేసి పారిపోతే ఎలా ఉంటుంది? ఎప్పుడూ మీదేనన్న వస్తువు మీది కాకుండా పోతే ఎలా పిచ్చెత్తుతుందో, మీ మన స్సలా - యిప్పటికీను. ఏం? నిజమేనా?

రాణి : (కలవారపాటుతో) నిజమేగాని, (సర్దుకుని) కాదు. వట్టి అబద్ధం.

రజని : ఇంకా చెప్తాను వినండి. క్షణికమయి ఆవేశానికి గురి అయి ఆ వస్తువును దూరం చేసుకున్నారు. తర్వాత

దానికోసం ప్రయత్నించారు మీరు. కాని తల పగల గొట్టుకున్నా లాభం లేకపోయింది అంతే. మీ జీవితం మరోదారి పట్టింది. ఏం ?

రాణి : (వేణు, ఆశ్చర్యపోతూ) నమ్మకం డీయన మాటలు - (అంది ఇరుకున పడి)

రజని : (నవ్వి) మీరు అబద్ధం చెప్పినా మీ ముఖం చెప్పదు. మానేయమంటే మానేస్తాను.

వేణు : తర్వాత చెప్పండి.

రజని : కావాలనుకున్న వస్తువు చేతికందలేదు. అక్కర్లేనిది దగ్గరకు వచ్చింది. దాన్నయినా అందుకోవాలనుకున్నారు. మనస్సు ఒప్పుకోలేదు. కానీ శరీరం కావాలంది. చివరికి శరీరం కమ్మిన వ్యామోహానికి గురి అయ్యారు. ఆ నాటకం కొన్నాళ్ళు...

వేణు : మీ మాటలు అర్థం కావటం లేదు.

రజని : ఆమెకు అర్థమయ్యాయేమో కనుక్కోండి.

వేణు : ఏం రాణీ.

రాణీ : నాకు పిచ్చెత్తుతోంది. యివన్నీ వింటూంటే (ముఖం ఎర్రబడింది. ఆందోళన దాచుకుందికి తలక్రిందకి దించుకుంది.)

రజని : కానీ నేను చెప్పినవన్నీ అబద్ధమని చెప్పమనండి. నాకు తెల్సినదంతా పక్కన వుంచి జీవితాంతం తలవొంచి బ్రతుకుతాను. ఊఁ అనమనండి.

రాణి : (మాట్లాడదు. కన్నీళ్ళు పర్యంతం అయిం దామెకు – పెదాలు వణికాయి.)

రజని : (నవ్వి) నా నలభై ఏళ్ళ జీవితంలో నేవిశిరిన రాయి వ్యర్థం పోలేదు అరుణకుమార్. ఏమిటి మీరలా స్తబ్ధుగా వుండిపోయేరు !

అరుణ : చాలా నిశితమయిన దృష్టిమీది !

వేణు : రాణీ ! అలా తలవొంచుకుంటావే ? – నువ్విప్పుడే పుట్టలేదని మా అందరికి తెల్సు. మాట్లాడు.

రాణి : ఏం మాట్లాడేది ? –

వేణు : ఆయన చెప్పిన విషయాలు నిజమా కాదా ? –

రాణి : .........

వేణు : (నవ్వి) మీరు చెప్పినవన్నీ నమ్మాను రజనీగారూ ! – కంగ్రాచ్యులేషన్సు.

రాణి : వేణూ ! (ఉదాసీనంగా)

వేణు : నువ్వు మాట్లాడకు. పెద్ద భవిష్యత్తుని వెనకేసుకు ఏడ్చేవాళ్ళని చూస్తే నాకసహ్యం – భూతకాలం లేకుండా భవిష్యత్తు ? మరిచిపోయి బ్రతకాలి – అదీ నా సంధా –

రాణి : ఇప్పుడింకేం మాట్లాడకు వేణూ ! – నేనింకేం చెప్ప లేను. (లేచి వెళ్ళిపోతుంది. నిశ్శబ్దంగా లేచి కిటికీ దగ్గరకి వచ్చి సిగరెట్టు వెలిగించాడు వేణు. సోఫాలో కూర్చుని Relax అయాడు. రజనీకాంత్.

రజని : (కాన్సేపటికి) క్షమించండి. మీ భార్య మనసుకి అనవసరంగా కష్టపెట్టాను. ఇలాంటి దుర్ఘటనలు నాకు ఎప్పటికప్పుడు ఎదురౌతుంటాయి. ఒక్కొక్కప్పుడు విసుగుపుట్టి యీ స్టడీయే మానేద్దామనుకుంటాను. కాని సాధ్యం కాదు. బ్రతకడానికి ఆహారం, నిద్రా ఎలా కావాలో నాకలా యిది-

అరుణ : నా విషయం చెప్తారా !-

రజని : ఈ స్టడీలో వున్న నిర్ధాక్షిణ్యాత చూచి కూడా మళ్ళీ అడుగుతున్నారా ఈ ప్రశ్న ?

అరుణ : చెప్పండి. పర్వాలేదు. మీలో లేదు ఆ నిర్ధాక్షిణ్యాత. ఆమె జీవితంలోనే వుంది.

రజని : వినండయితే - ఒంటరితనము కావాలి మీకు. లోకంలోని నీచత్వం, దుర్మార్గత, యింకా మీ మనస్సుకి తాకలేదు. యింకా చాలా చూడాలి మీరు. ఎవరేం చెప్తే అది పూర్తిగా నమ్మేస్తారు. అంచేత మీకు కష్టాలు కలుగుతాయి. కాని మీ మంచితనమే మిమ్మల్ని రక్షిస్తుంది. ఏ మనిషిలో ఏ మాత్రం... .........కన్పించినా మీరు ప్రాణం పెట్తారు. చాలా యిది ?

వేణు : నా విషయం ?

రజని : ఇప్పటికీ మిమ్మల్ని చాలా బాధపెట్టాను.

వేణు : దానికేం లెండి. రాణి నా జీవితంలోకి కలలాగా వచ్చింది. ఉన్నది ఉన్నట్టు చెప్పారు మీరు. మీ తప్పేముంది ?–

రజని : అందరూ మీలాంటివారే ఉండరు. (ఆలోచించి) ఒకప్పుడు మీరు ఇప్పుడున్నంత స్తబ్ధుగా, నిర్లిప్తంగా వుండేవారు కారు. అవునా ?

వేణు : మీకెలా తెల్సు ?

రజని : అవునో కాదో చెప్పండి.

వేణు : అవునేమో ?

రజని : ఎప్పుడో, ఒకప్పుడు......సుమారు రెండేళ్ళ క్రితం అనుకుంటాను. జీవితంలో మరిచిపోలేని సంఘటన ఒకటి జరిగింది. అందువల్లనే మీరు కృంగిపోయేరు. బాహ్యంగా కాకపోయినా, ఆంతరంగికంగా, అవునా !–

వేణు : (మనస్సు చెదిరింది) తెలీదు.

రజని : తెల్సు మీకు. నా ముఖం చూసి చెప్పండి.

వేణు : అరుణకుమార్; – దయచేసి బోయ్‌ని పిలివండి. కాఫీ తెస్తాడు.

( అ రు ణ కు మా ర్ వె ళ్తా డు )

రజని : (నవ్వి) ఇప్పుడు చెప్పండి పోనీ.

వేణు : ఏమిటి చెప్పమంటారు,

రజని : పోనీ నేకొంత చెప్తాను వినండి. ఒక చిన్న విషయం మనిషి జీవితం మీద ఎంతగా దెబ్బ తీస్తుందా అన్న

ప్రశ్నకు మీ జీవితం నిరర్థకం - (దగ్గరకు వచ్చి)
నిజం చెప్పండి - మిమ్మల్నీ పరిస్థితికి తీసుకు వచ్చిం
దెవరూ? - ఒక్క 'ఆడది' కదూ?

వేణు : అవును.

రజని : ఇంకా చెప్పండి.

వేణు : జీవితమంతా పాడయి పోయిందిఒక్కరోజుసంఘటనలో

రజని : జీవితం మిమ్మల్నేంచేసింది?- ఒక్క-స్త్రీ,

వేణు : అవును. స్త్రీ. మీకంతా తెల్సు కాబట్టి చెప్పాల్సిన
పనిలేదు. నాలుగేళ్ళ క్రితం సరిగ్గా మీరిప్పుడు నిలబడ్డ
చోటునే ఆమెనిలబడింది. నేనిలాగా. ఒకరినొకరు
చూస్తూ ఉండిపోయాం భర్తతో వచ్చిందామె
ఇక్కడికి-

రజని : భార్యా భర్తలు కావువాళ్ళు-

వేణు : ఊఁ, మరి !-

రజని - చెప్తాను తర్వాత, మీరు చెప్పండిముందు ?-

వేణు : ఏ ముంది?- ఆమె అంతం పూర్తిగా నన్నాకర్షించిందన
లేను - కానీ ఎందుకో నన్ను నేను మరచి పోయాను
ఆమె చూస్తుంటే - అర్థమయిందికదూ ?

రజని : ఆ తప్పుమీదికాదు. మీవయస్సుది. కానీయండి.

వేణు : ఆ నాటినుంచి నా అధఃపతనం ప్రారంభమయింది.
క్షణికమయిన ఆవేశంలో ఎంత తప్పిదాన్ని చేశానా
అనుకొంటూ ఉంటాను అప్పుడప్పుడు.

రజని : (నవ్వి) తప్పిదం !- తప్పులు చేయగలగడం మనిషిగా బతికడానికి ఒక అర్హత యీ రోజుల్లో. మనం మానవులం. ఎంత ప్రయత్నించి హృదయాన్ని జయించటం కష్టం. చూడండి. హృదయం పసిపాపలాంటిది. అది చూసిందల్లా కావాలంటుంది.

వేణు : నిజం ! ఆ సమయంలో అలాగే జరిగింది – కాని ఆమె భర్త దేవుడిలాంటివాడు. ఆమె నాతో వస్తానంటే నిర్వికారంగా సాగనంపాడు. అంతే తీసుకు వచ్చేశాను రాణీని.

రజని : ఏ భర్తా చేయలేని పని – అవునా ?

వేణు : నిజం.

రజని : ఇక నా విషయం వినండి. అయిదేళ్ళనుంచి పరిశోధనలు చేస్తున్నాను మనస్తత్వం గురించి. స్త్రీ విలువలు గుర్తించటం నా మొదట పనిగా పెట్టుకున్నాను. ప్రపంచం అంటే తెలియని వ్యక్తిలో హఠాత్తుగా చైతన్యం కన్పిస్తే – ముఖ్యంగా స్త్రీలో – ఆమె ఉద్దేశాలు, ఊహలు, ఎటువంటి మార్పు చెందుతాయి. ఎటువంటి విచిత్రమయిన సంఘటనలకు దారితీస్తాయి అని ఒక్కొక్కప్పుడు ఆలోచించేవాణ్ని. ఈ పరిశోధన ఎవరిమీద జరపాలా అని ఆలోచించాను. చివరకి నా ప్రయత్నం ఫలించింది. నా పరిశోధనకు కావలసిన స్త్రీ దొరికింది.

వేణు : ఎవరు ?.

రజని : తనెవరో తనకే తెలీకుండా, తెగిన గాలిపటంలాగా బ్రతికే ఒకామె. ఎవరయితేనేం ? – ఆమె ముందు జీవితాన్ని చెప్ప నిప్పుడు. కాని అప్పట్లో ఆమెలో కన్పించిన ప్రత్యేకతల్లా తొందరగా గ్రహించే నేర్పు, అమాయకత్వం, ఉత్సుకత, నా పరిశోధనకు ఆమెను సరియైన మనిషిగా ఎన్నుకున్నాను. ఏం ? ఆశ్చర్యంగా లేదూ ? –

వేణు : లేదు కొత్తగా ఉంది,

రజని : చాలా కష్టంమీద ఆమెను ఒప్పించాను. తర్వాత విషయం చాలా తక్కువ. ఆరు నెలలు తిరక్కుండా మనిషి మారింది. మనసు మారింది. ఓ వ్యక్తిత్వం అంటూ ఏర్పరుచుకొంది – తనకు కూడా మనస్సు ఉన్నదనీ, తన వ్యక్తిత్వానికి ఓ విశిష్టత అవసరమని, తన జీవితానికి ఓ ధ్యేయం వున్నదని తెల్సుకుంది – అటువంటి వ్యక్తికి ఎలాంటి కోరికలుంటాయో మీరూహించలేరు – అవునా ? –

వేణు : నిజమే ?

రజని : ఆమె కోరిన చోటికెల్లా తిప్పాను. కోరిన వ్యక్తుల్ని పరిచయం చేసాను. కోరిన వస్తువులిచ్చాను. ఫలితం ఏమిటో తెల్సా ?

వేణు : ఏమిటి ?

రజని – ఒక్కటి మాత్రం తెల్సింది. స్త్రీకి తృప్తిలేదని. ఎదుట వ్యక్తి తన అందానికి ముగ్ధుడవుతున్నాడా లేదా

అన్నది - మరొక్క విషయం. ఆడది అందమయిన దయితే ఎదుటవాళ్ళని ఆకర్షించకుండా విడువదు. ఇదే నేకనిపెట్టిన విషయం - స్త్రీ గురించి. హ్హా... హ్హా...హ్హా...

( నవ్వుతూ సోఫాలో కూలబడ్డాడు )

వేణు : ఆమె యిప్పుడు ఎక్కడుంది ?

రజని : తనకి కావల్సిన తృప్తినిచ్చే వ్యక్తిదగ్గర ఉంది. అనుక్షణం ఆమె అందాన్ని మెచ్చుకొనే వ్యక్తిదగ్గర. ఇంకా చెప్పమంటారా ?

వేణు : ఊఁ.

రజని : మీ దగ్గర. (నవ్వుతాడు)

వేణు : నాదగ్గరా ?

రజని : అవును. మీదగ్గరే. యీ నాలుగేళ్ళలో నేను చాలా మారిపోయేను. మరొక్కసారి నావేపు చూడండి. నాలుగేళ్ళక్రితం రజనీకాంత్ జ్ఞాపకము వస్తాడేమో ?

వేణు : (షాక్ తింటాడు, రజనీని గుర్తుపట్టినమీదట) అవును. ఇప్పుడిప్పుడు గుర్తుకొస్తున్నారు. అప్పటి మీరూ, మీ మాటలూను. ఇదే హోటల్లో కలిశాం. మీరూ, రాణీ కలిసివచ్చారు......(ఏదో చెప్పబోయి) నన్ను క్షమించు......

రజని : క్షమించడానికేంలెండి - అసలు విషయం చెప్పమంటారా ? - నా పరిశోధనకి కావాల్సిన యంత్రంలా

రాణిని ఉపయోగించుకున్నా నేను. అంతకన్న ఆమె అవసరం నాకు లేదు. కాని నా గురుంచి ఆమె ఏవో పిచ్చి ఆశలు పెట్టుకున్నదని సంవత్సరం గడిచాక తెల్సింది. భయపడ్డాను. దరిమిలా నేను అశక్తుణ్ణి అని తెల్సుకుంది. తనక్కావల్సిన వ్యక్తికోసం ఎదురు చూసింది. చివరకు మీరు కన్పించారు. మిమ్మల్ని ఎంచుకుంది. అందుకేమీ విచారపడలేదు నేను. ఎందుకంటే ఆమె నా వస్తువుకాదు గనక –

వేణు : అంతా విచిత్రంగా వుందీ !

రజని : మరో విచిత్రం – నిజానికి రాణి మిమ్మల్ని కూడా ప్రేమించలేదు.

వేణు : మరి !

రజని : మీలో ఉండే పొగడ్తలో, మాటలో నేర్పుని – తన అందాన్ని మెచ్చుకునే మీ బలహీనతని ప్రేమించింది. అర్థమయిందా ?

వేణు : అంతా తమాషాగా ఉందే !

రజని : సరేలెండి. ఇప్పటికే మిమ్మల్ని చాలా విషయాల్లో విసిగించాను. కవులకు కాలం విలువ తెలీనట్టుందీ ! యీ బోయ్ యింకా రాలేదు చూడండి.

వేణు : మీరు కూర్చోండి. నేను పంపుతాను. (వెళ్తాడు)

(రజని ప్రశాంతంగా వున్నాడు. బుద్ధుడు విగ్రహం దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. విగ్రహం అందాన్ని అన్ని

వేపులనుంచీ గమనిస్తున్నాడు. కాస్సేపయాక రాణీ మెల్లగా వచ్చింది. అతన్ని చూస్తూ నడుస్తూ టీపా య్ని తన్నుతుంది. పూలకూజా క్రిందపడి పగిలింది. త్రుళ్ళిపడ్డాడు రజనీకాంత్. ఆమెకేసి చూశాడు. ఆమెలో యిదివరకటి ఉత్సాహం లేదు. కళ్ళు ఎర్ర బారి వున్నాయి.)

రజని : నువ్వా రాణీ ?

రాణి : అవున్నేనే. (ఆగి) చెప్పండి. ఇక్కడికెందుకొచ్చారు ?

రజని : నేను... నే నెవరని ?

రాణి : ఎవరు తెల్సుకోలేకపోయినా, నేను మాత్రం తెల్సుకో గలను. నన్ను మనిషిని చేసిన, వ్యక్తిని – (మాటలో వణుకు స్పష్టంగా తెలుస్తోంది. ముఖాన్ని కిటికీవేపు గోడలోకి తిప్పుకుంది.)

రజని : రాణీ !

రాణి : చెప్పండీ. ఎందుకొచ్చారు ?

రజని : హోటలు అందరికి ఉద్దేశింపబడిందేగా ?

రాణి : అయినా మీరనుకుంటే రావడం మానేయగలరు ?

రజని : మీరిప్పుడు ఇక్కడున్నట్టు నాకు తెలియదు.

రాణి : పోనీండి ఆ విషయం. మళ్ళీ అప్పటి సంగతులన్నీ ఎందుకు కదిపారు ?

రజని : నువ్వే కదిపావు. నొక్కి నొక్కి "చేప్పేదా" అని అడి గాను చెప్పమన్నావు. చెప్పాను.

రాణి : ఇవాళ నా మనస్సంతా పాడయింది.

రజని : క్షమించు నేరంచేస్తే.

(Pause)

రజని : ఇంకా ఆయన దగ్గరే వుంటున్నావా ?

రాణి : ఎవరి దగ్గర ?

రజని : వేణుదగ్గర.

రాణి : ఆటవస్తువునా రోజుకో చెయ్యి మారడానికి ?

రజని : నీకే తెలియాలి.

రాణి : మనిషిని చులకన చెయ్యటం మీకు తెలిసినట్టు-

రజని : క్షమించు – మరోసారి –

రాణి: ఇదో ఆయుధం మీదగ్గరెప్పుడు సిద్ధంగా వుంటుంది.

రజని : నీకళ్ళు నీ దగ్గర వున్నట్టు.

రాణి : మనస్సు నొప్పించడానికా వచ్చారు-

రజని : మనస్సు దాచుకోక వచ్చాను.

రాణి : చూడడానికా ?

రజని : చూస్తే ఏం ప్రయోజనం ? చేతి కందవుగా ?

రాణి : .........

రజని : జవాబు చెప్తావనుకున్నాను.

రాణి : ఏం చెప్పేది ?

రజని : ఆలోచించు.

రాణి : ఆనాటినుంచీ ఆలోచించడం మానుకున్నాను.

రజని : నాగురించా ?

రాణి : నీగురించి తప్ప......

రజని : (మాట్లాడకుండా కుడిచివరకు వచ్చి నిలబడ్డాడు. ఆమెను నఖ శిఖ పర్యంతంగమనించి నవ్వాడు.)

రజని : అబ్బో చాలా మారావే! మాటలో, తీరులో.

రాణి : ఇంకా ?

రజని : ఆకారం – తెల్లటి ఒంటికి, నీలి చీర అతకలేదు – అతనేనా చెప్పాడు ?

రాణి : ఒకరు చెప్పాలా యేం ?

రజని : నేనయితే కెంపురంగు చెప్పేవాడిని – ఎర్రగా, మంచు ముద్దలాగు – భయమేసేట్టుండాలి నువ్వు. నీ అందం మూర్ఛపోయి దగ్గరకు తీసుకొనేదికాదు. భయపెట్టి దూరంగా త్రోసేసేది –

రాణి : మాటలు నేర్చారు విదేశాలకు వెళ్ళి, –

రజని : ఆగమనేవారు లేక విదేశలకు వెళ్ళాను – ...... – మాటల్లో మనస్సు దాచుకోగల శక్తివుంది – అందు కని నేర్చుకున్నాను.

రాణి : వుంటారా ?

రజని : వెళ్ళమంటే ఇప్పుడే పోతాను.

రాణి : నాదికాని వస్తువుమీద నాకేం అధికారం

రజని : (నవ్వి) నా మాటలు నాకు అప్పగిస్తున్నావా ? –

రాణి : (ఉదాసీనతలో, గొంతు జీరబోయింది)

మీలాగుండెల్ని తాకేట్టు మాట్లాడ్డం నాకు చేత కాదు.

రజని : .........

రాణి : మనస్సు గాయపర్చడం అంతకన్నా రాదు.

రజని : ......

రాణి : ఎవరిమీదా పరిశోధనలు చేయటం నాకు చేతకాదు.

రజని : ......

రాణి : ఇప్పటికిప్పుడు మీరు నాతో వచ్చేయమని చేయి పట్టుకుంటే కాదన లేను.

రజని : ... ... ...

రాణి : ఇంక మీకు మాటలు నేర్పాలి కాబోలు

రజని : (ఇంతసేపు కిటికీలోంచి బయటకు చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.)

రాణి : ఏమిటి ఆలోచిస్తున్నారు ?

రజని : (ఉన్నట్టుండి) ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది – నిన్నెందుకు వదులుకున్నానా అని ? – శరీరంలో అవయవం పోయినట్టు బాధపడ్డాను నువ్వు పోయినాక – కొన్నాళ్ళు –

రాణి; .........

రజని : (బయటికి చూస్తూ) ఏమిటి చూస్తున్నానో తెల్సా ?— నాలుగేళ్ళక్రితం ఇక్కడో పూలచెట్టు ఉండేదని చూస్తున్నాను.

రాణి : .........

రజని : అంతే రాణి ? జీవితం చాలా సుళువుగా జారిపోతుంది ప్రపంచంలో చాలా వాటిల్లాగు. నాలుగేళ్ళక్రితం యీ హోటల్ బోయ్ దాన్నిక్కడ పాతాడు, మనం యిక్కడకు వచ్చినప్పుడు ఈ నాలుగేళ్ళలో ఎన్నో పువ్వుల్ని ప్రసాదించి, యౌవనపు పసిమిలో నిగనిగ లాడి వుంటుంది. నాలుగేళ్ళ తర్వాత మళ్ళీ యివాళ చూస్తే దాని ఆయుర్దాయం సరి. ఎండిన కొమ్మలూ, ఆకులూ — ఇక్కడొకప్పుడు పరిపూర్ణ యౌవనంలో వాళ్ళు విరిచినచెట్టు ఉండేది అన్న జ్ఞాపకం తప్ప యింకేమీ మిగల్లేదు.

రాణి : నన్నెందుకిలా ఏడిపిస్తావు ?

రజని : నీలో యింకా కన్నీళ్ళు మిగిలి ఉన్నాయా ?

రాణి : ......

రజని : ఒకప్పుడు నిన్ను నేను ప్రేమించేవాడిని.

రాణి : ఇవాళ మొదటిసారిగా మీ నోటంట ఆ మాటలు విన్నాను.

రజని : అప్పుడు చెప్పడం అనవసరం అనిపించింది.

రాణి : (ఎంతో సేపటికి) వెళ్ళేదా యిక ?

రజని : నన్నడిగే వచ్చేవా ? – వెళ్ళడానికి ?

రాణి : సూటిగా మాట్లాడలేరా ?

రజని : వెళ్ళిరా ? – సరా ? – (వెళ్ళబోతుంది ఏడుస్తూ; అంతలో ఆగి ఒక్క ఉదుటన కుర్చీలో కూచున్న అతని ముందుకు వచ్చి నిలబడింది.)

రాణి : నన్నెందుకిలా తయారు చేసారు ?

రజని : నువ్వే మారావు.

రాణి : ఆనాడు నన్నలాగే బ్రతకనివ్వవలసింది-

రజని : .........

రాణి : నాకొక మనస్సుందని తెల్సేట్టు చేసారు.

రజని : మంచికేగా ?

రాణి : మంచిది — మంచిది — మంచిది. ఇంతే మీకు తెల్సింది.

రజని : ఇక వెళ్లు.

రాణి : మీలో దయకూడా లేదు – (ఏడుస్తూ వెళ్ళిపోయింది.)

(రజనీకాంత్, స్వతహాగా నిశ్చలుడయినా యిప్పుడు చలించాడు. మెల్లగా మనస్సు కూడదీసుకుంటున్నాడు. అలసటలో నిట్టూర్చేడు. తల వెనక్కి వేలేసి కళ్ళు మూసుకున్నాడు.)

బోయ్: (వచ్చాడు) కాఫీకావాలా సార్ ?

రజని : (కళ్ళు మూసుకునే) నువ్వొక్కడివే కన్పించావు, నా విషయం పట్టించుకొనేవాడివి. తీసుకురా.

(బోయ్ వెళ్ళాడు. అరుణ కుమార్ కాస్సేపటికి వచ్చాడు తల తుడుచుకుంటూ.)

అరుణ: అరే మీరొక్కరే వుండిపోయారా ఇక్కడ? కాఫీ తీసుకోలా?- పంపమని చెప్పానే బోయ్‌తో.

రజని: వస్తుంది. కూచోండి.

అరుణ: ఇప్పుడే స్నానం ముగించి వచ్చాను.

రజని: అయితే శరీరానికి స్థాయి కుదిర్చారన్నమాట.

అరుణ: ఇకమనస్సుకి మీరు......

రజని: తప్పకుండా - ఇందాక మీరు నన్నో విషయం అడిగారు! గుర్తుందా?

అరుణ: ఏవిషయం?

రజని: face Reading గురించి.

అరుణ: మీరు సరిగ్గానే చెప్పారు.

రజని: కానీ చెప్పాల్సింది చాలా వదిలేశాను. సమయం అది కాదని తెల్సునాకు.

అరుణ: ఎమిటావిషయం?

రజని: అది చెప్పేముందు కొన్ని పశ్నలకు సమాధానం యివ్వండి.

అరుణ: మీాయిష్టం.

రజని: మీా జీవితంలో ఎప్పుడన్నా 'స్త్రీ'ని చూశారా?

అరుణ: చాలా వింత ప్రశ్న అడిగారే!

రజని : జవాబు చెప్పండి.

అరుణ: రోజూ చూస్తూనే వుంటాం నిత్య జీవితంలో వేలాది మంది.

రజని ; స్త్రీ అంటే అదికాదు. తెలీక చేసిన నేరాన్ని దిద్దు కోడానికి మరోటి చేస్తూ-జీవితమంతా పాపభూయిష్టం చేసుకున్నా స్త్రీ మాట నేనడిగేది –

అరుణ: చూడలేదు అలాంటి వ్యక్తిని –

రజని : కాదు చూశారు మీరు. తర్వాత చెప్తాను ఆ విష యాన్ని పోనీయండి – సిగ్గుపడకుండా సమాధానం యివ్వండి. రాణి అందమైందికదూ ?– అవును, కాదు, అంతే!

అరుణ: అవును,

రజని : పురుషుణ్ణి మత్తెక్కించే ఆయుధం ఆమె కళ్ళు. అవునా ?

అరుణ : ఊ!–

రజని : ఆమె ప్రేమని పొందటం అందరికీ సాధ్యం కాదు. ఏమంటారు ?

అరుణ : ఈ ప్రశ్నలన్నీ...

రజని : ఎందుకో చెప్తాను; అవును కాదో చెప్పండి.

అరుణ : అవును.

రజని : స్త్రీత్వం ఆమె ఒకే ఒక్క ఆయుధం, అనుకోనంత గొప్ప ఆనందంలో మునిగి యికనేం చెయ్యాలో

తెలీక ఉక్కిరి బిక్కిరయి మునిగిపోయిన పరిస్థితి రాలేదు. – సరే యివి చెప్పండి. – ఈ క్షణాన్ని ఆమె మీ ముందు నిలబడి మీతో రావడానికి సిద్ధపడితే సందేహిస్తారా మీరు ?

అరుణ : .........

రజని : మాట్లాడండి – రవయితే మీరు. అబద్ధమాడితే ఆత్మ ద్రోహం చేసుకున్నట్టే. అవుసంటే ప్రాణం తీయన్నేను.

అరుణ : సందేహించను.

రజని : మంచిది...(నిట్టూర్చి, ఆలోచించి) మీరు రాణీని తీసుకు పోవచ్చు.

అరుణ : అదేమిటి ! నాకేం అర్థం కావటం లేదు.

రజని : అర్థం కావటానికి యిందులో ఏం లేదు. కుమార్ ?. మీ మనస్సు మిమ్మల్నెప్పుడు మోసం చెయ్యదు. అది చెప్పినట్టు చెయ్యండి. – వెయ్యి రజనీకాంతలు అడ్డొచ్చినా సరే. తెల్సిందా ?–

అరుణ : కానీ, యిదంతా...

రజని : మీకే తెలుస్తుంది – కానీ జ్ఞాపకం ఉంచుకోండి. ఆమె ముందు కూడా యిప్పుడు నాదగ్గర చెప్పిన మాటలే చెప్పండి – సందేహించకండి. అనకపోతే... పదేళ్ళ తర్వాత యిప్పటి తప్పును ఫలితం అనుభవిస్తారు. మరి వస్తాను. గది ఏర్పాట్లు చూసుకోవాలి.

( వెళ్తాడు )

(అరుణకుమార్ తలక్రిందులయ్యాడు - ఏదో ఆలోచిస్తూ కిటికీ చేరబడి నిలబడేలోగా, రాణి వచ్చింది.)

అరుణ: (అనుకోకుండా పిలిచాడు.) రాణీ!

రాణి : మీరా! ఆయ నేమోననుకున్నాను.

అరుణ: (సిగ్గుపడి) క్షమించండి - ఆలా పిలిచినందుకు.

రాణి : పర్వాలేదు లెండి

అరుణ: ఇవాళంతా మనస్సు కలచినట్టుంది.

రాణి : మీాకూనా?

అరుణ: ఏం? మీారు అదే పరిస్థితిలోనే?

రాణి : ఉఁ–

అరుణ : మీా కలవరపాటుకి కారణం చెప్పనా?

రాణి : ఊఁ——

అరుణ: రజనీకాంత్ గారి రాక!

రాణి : కుమార్ గారు!

అరుణ: క్షమించండి - నా కలా అనిపించింది. అంతే (రెండు క్షణాలు నిశ్శబ్దంగా ఉండి పోయారు.

ఆయన యిప్పుడే వెళ్ళారు. (ఆగి) వెళ్తూ ఓ మాట అన్నారు.

రాణి : ఏమిటది?

అరుణ: మీ అత్మకు మీరు ద్రోహం చేసుకోవద్దని.

రాణి: మంచిదే.

అరుణ: మనస్సు ఎలా చెబితే అలా చేయమన్నారు.

రాణి: చెయ్యండయితే.

అరుణ: తీరదగ్గర చెప్పిన మాటలు వీలయితే ఎవరి దగ్గరా చెప్పడానికి వెనుదియ్య వద్దన్నారు. చివరికి మీతో నన్నా సరే!

రాణి: నాతోనా!

అరుణ: అవును.

రాణి: ఏమిటా మాటలు?

అరుణ: మిమ్మల్ని ప్రేమిస్తున్నాననీ, ఈ క్షణంలో మీరు నాముందు నిలబడి నా చెయ్యి పుచ్చుకుంటే తడబడ ననీ –

రాణి: కుమార్‌గారు.

అరుణ: ఇవీ ఆయనతో నేనన్న మాటలు,

రాణి: (ఆశ్చర్యం, భయం. వణకు) ఆయనతో అన్నారా మీరు?

అరుణ: అన్నాను. ఆయన ఏవో ప్రశ్నలు వేశారు. గుండె లోతుల్ని తరచి ఈ మాటలు చెప్పించారు.

రాణి: (నిలువునా వణుకుతోంది) ఆ మాటల్లో అర్థం తెలిసే అంటున్నారా మీరు?

అరుణ: ఊఁ.

రాణి: (తలపట్టుకుని సోఫాలో కూలబడి ఏడ్చింది.)

అరుణ: (భయపడ్డాడు. వారించటానికి దగ్గరకు వచ్చి ఆగిపోయేడు) క్షమించండి. ఇంకెప్పుడూ యిలాంటి విషయాలు మీా ముందు చెప్పను. ఇవాళ నాకు పిచ్చెక్కింది - (ఆమె అలగా వుంది.) రజనీకాంత్ ఏవేవో అన్నారు. అన్నీ అర్థం కాలేదు నాకు. కాని మనస్సులో ఏదో వుందతనికి. యీా మాటల్ని ఊరికే అని వుండడు ఆయన అన్నాక ఆలోచించి చూశాను.

(సోఫాలో రాణీ, కిటికీ దగ్గర అరుణకుమార్ స్తబ్ధుగా ఉండిపోయేరు రెండు క్షణాలు. ఒక్కసారి తలెత్తి చూసిందామె అతనివేపు. అదే క్షణంలో అతనూ ఆమెవేపు చూశాడు. ఇద్దరూ తలవొంచుకున్నారు. మరో రెండుక్షణాలు గడిచాయి.)

అరుణ: రేపే వెళ్ళిపోతా నిక్కడ్నుంచి కాని ఒక్కటి మాత్రం నిజం – ఈ సంఘటనల్నీ, యీా మనుష్యుల్నీ, ముఖ్యంగా రజనీకాంత్‌నీ మరిచిపోలేను.

(రాణీ మాట్లాడపోయేసరికి నిరుత్సాహితుడయి లోపలికి వెళ్ళబోతాడు.)

రాణి: కుమార్‌గారూ! ఒక్కక్షణం ఆగండి-

అరుణ: (వెనక్కు వచ్చాడు ఆశ్చర్యపోతూ. రాణికళ్ళల్లో ఎరుపుచూసి నిర్ఘాంతపోయేడు.)

రాణి : (నిర్లిప్తంగా ఉన్నది.) కొన్ని విషయాలు మీతో మాట్లాడాలి–

అరుణ : మాట్లాడండి–

రాణి : ఏమీ అనుకోకండి సూటిగా అడిగే ప్రశ్నలకి. యిప్పట్లో వీటి అవసరం ఎంతయినా వుంది.

అరుణ : అడగండి.

రాణి : మీరెవరు ?

అరుణ: అంటే ?

రాణి : సంఘంలో, మీస్థానం. పెద్దప్రశ్నలు – అడుగుతున్నాననుకుంటాను.

అరుణ: చిన్న జవాబుచాలు. రచయితన్నేను. జీవితంలో ఎందుకూ పనికిరానివాడు రచయిత అవతాడు.

రాణి : ఏమిటి మీరు కోరేది – జీవితంనుంచి ?–

అరుణ: ఒక్కమాటలో చెప్పలేను,

రాణి : అంటే ?

అరుణ: చాలా కావాలినాకు. తృప్తి ఎక్కడికి ?– ఉదాహరణకి నన్ను నేను లోకానికి చెప్పుకోగలగడం, నాకు నేను బ్రతకడం.

రాణి : అంతేనా ?

అరుణ: ఇంకా చాలా కావాలినాకు. ఉదాహరణకి – స్త్రీ.

రాణి : ఎలాటిస్త్రీ ?

అరుణ (సూటిగా రాణి ముఖంలోకిచూచి నవ్వాడు) జీవితంలో ఒక తప్పుచేసి, కాలుకూడ దీసుకోలేక మరో తప్పు చేస్తూ జీవితాన్నంతా పాపభూయిష్టం చేసుకున్న స్త్రీ మాత్రం కాదు.

రాణి : (త్రుళ్ళిపడింది) నిజం చెప్పండి. ఈ మాట ఆయనేనా అన్నారు.

అరుణ : ఆ యనెవరు ?

రాణి : ఎవరో మీకే తెల్సు.

అరుణ : అవును. ఆయనే !

రాణి : మీరు నమ్మారా ?

అరుణ : ఆ స్త్రీ ఎవరో నాకు తెలీనిదే ఎలా నమ్మను.

రాణి : నిజంగా తెలీదా ?

అరుణ : ఊహుఁ–

రాణి : నా ముఖం చూసి చెప్పాలి జవాబు.

అరుణ : ఇదో కొత్త అనుభవం.

రాణి : ఏది జవాబు చెప్పడమా ? – స్త్రీని తెలీకపోవడమా?

అరుణ : మొదటిది.

రాణి : ఇప్పుడు వినండి. నేనే ఆ స్త్రీ.

అరుణ : అలానే వూహించాను.

రాణి : ఊహించాక ఏమనుకున్నారు ?–

అరుణ : స్త్రీకి జన్మత : కొన్ని బలహీనతలున్నాయి. అవి తప్పిస్తే ఆమె అంత అద్భుతమయిన శక్తి మరొకటి లేదనుకున్నాను. అర్థమయిందా

రాణి : (తలూపింది)

అరుణ: ఇంకేమయినా అడగాల్సివుందా ?-

రాణి : లేదను కుంటాను.

అరుణ: నేనొకటి అడిగేదా ?

రాణి : అడగండి.

అరుణ: రజనీకాంత్ ఎవరన్న ప్రశ్న అడగను... కానీ ఒక ప్పుడు మీరతన్ని ప్రేమించేవారు కదూ !- ప్రాణానికి ప్రాణంగా......

రాణి : తెల్సుకు ఏంచేస్తారు ?-

అరుణ: దీని జవాబులో మీ జీవితమంతా యిమిడి వుంది.

రాణి : ప్రేమించేదాన్ని !

అరుణ: అంతే నేనడగాల్సింది. యింకేమీ లేదు.

రాణి ; (లేచి కిటికీ కర్టెను పట్టుకొని అంది, ముఖం కన్పించ నీయకుండా నిలబడింది.) నేనుకావాలా మీకు.

అరుణ: (ఓయుగం తర్వాత) ఏమో తెలీదు.

రాణి : ఎక్కడికన్నా పోదాం పదండి

అరుణ; రాణీ.

రాణి: తెలిసే అడుగుతున్నాను యీ ప్రశ్నని, జవాబు చెప్పండి

అరుణ: ... ...

రాణి: మంచికీ, చెడుకీ, సుఖానికీ, దుఃఖానికి తెగించి సిద్ధపడాలి అవునవగలిగే శక్తిఉంటే......

అరుణ: (విస్తుపోయి ఆమెకేసి చూశాడు)

రాణి: (నవ్వింది) వెళ్ళండి – వెళ్ళి కాఫీ త్రాగి కథలు రాసి 'ఇదే జీవిత'మనుకొని నిద్రపొండి – (అతను వెళ్ళక పోవడం చూసి తనే నవ్వుకుంటూ అతి సామాన్యంగా లోపలికి వెళ్ళబోయింది – తనిని దాటేసరికి చెయ్యి పట్టుకు ఆపాడు అరుణకుమార్. విచిత్రంగా ఆమె అతనివేపు చూసింది –)

అరుణ: నేను సిద్ధమే.

రాణి: క్షణంలో వస్తాను వదలండి – ఈలోగా మీజీవితాన్ని వేరే మార్గాన్ని పట్టించడానికి కావల్సిన ధైర్యాన్ని కూడ దీసుకోండి.

( వెళ్తుంది. )

( కాస్సేపటికి రజనికాంత్ వచ్చాడు. )

రజని: ఏం కుమార్ గారు! ఇందాకటినుంచీ వంటరిగానే ఉన్నారా

అరుణ: లేదు. మీరు కాఫీ త్రాగి వచ్చేలోగా నా జీవితంలో ఏమేమో లేని మార్పులు జరిగి పోయేయి.

రజని : ఏమిటవి ?

అరుణ : రాణీతో మీరు చెప్పమన్నట్టు చెప్పాను.

రజని : ఏ మన్న దామె ?

అరుణ : మీరు చెప్పినట్టే చేసింది. ఇప్పుడే వస్తానని వెళ్ళింది.

రజని : మంచి దే. నేననుకున్నట్టే జరుగుతోం దన్నమాట.

అరుణ : ఇదంతా నాకేం అర్థం కావడంలేదు. అంతా కలలా జరుగుతున్నట్టుంది. వేసవి గడపడానికి యిక్కడకు రావడమేమిటి, పరిస్థితులు యిలా ?-

రజని : మనం అనుకున్నవన్నీ అనుకున్నట్టు జరగవు కుమార్ గారు; ఇది జీవితం—చదరంగం కాదు.

అరుణ : ఇప్పుడేం జరుగుతుంది ?-

రజని : మీరే చూస్తారుగా ?-

వేణు : (పిచ్చెత్తినట్టు అరుస్తూ వచ్చేడు) ముందే అనుకున్నాను ఏదో తుఫాన్ రేగబోతోందని – ఏదో... (రజనినీ చూసి ఆగిపోయేడు. ఏదో జ్ఞాపకం వచ్చి దిగ్భ్రమతో) రజనీకాంత్ :- (చెప్పబోయి ఆగాడు.)

రజని : నాకంతా తెల్సు.

వేణు : ఏమిటి ?

రజని : తుఫాన్ సంగతి.

వేణు : ఏ తుఫాన్.

రజని : మీ జీవితంలో రేగబోయేది ?

వేణు : ఏమిటి తెల్సు మీకు ?

రజని : రాశి మీకు దూరం కాబోతుంది. అంతేనా ? – నేను నాలుగేళ్ళక్రితం అనుభవించిన తుఫాను. అసలది తుఫాన్ కాదు. ఓ చక్కటి అనుభవం, జీవితం, స్త్రీ కలిసి సమిష్టిగా నేర్పిన పాఠం.

వేణు : మీకెలా తెల్సీవిషయం ?

రజని : ముందే చెప్పానుగా face Reading తెల్సండి. ముఖాన్నే కాదు మనస్సుని కూడా చూడగలను నేను. వస్తూనే యీ విషయాన్ని కనిపెట్టగలిగాను నేను. ఇక్కడ జరగబోయేవన్నీ ముందే వూహిం చాను.

వేణు : ఎలా ?

రజని : రాశీ పువ్వులాంటిది. వాసనలు వెదజల్లడం తప్ప యింకేమీ తెలీదు. మంచీ, చెడూ ఆమె వూహకి అతీతం. తెల్సుననుకుని భ్రమపడుతుంది. కాని తెలీదు. మీ మాటని ప్రేమించినట్టే – అరుణకుమార్ అం దాన్ని, అమాయకత్వాన్నీ చూసి ప్రేమించింది – ఈ నాలుగేళ్ళలో బహుశా, మీరు చాలాసార్లు – యిందాకటిలా తగువులు పెంచుకొనివుంటారు. ఆమె

ప్రతిమాటలో ఆమె మనస్సుని కనిపెట్టాను... ఇహా యిప్పుడు మీరంటే జాలితప్ప ఆమెలో యింకేమీ లేదు ... ఇప్పుడేమంటారు ?

వేణు : అయితే చూస్తూ వూరుకుంటారా ?

రజని : ఊరుకోక చేసేదేముంది ?— నిజానికి మీరూ బాధ పడాల్సిన అవసరం లేదు. అసలు మీరుకూడ ఆమెను ప్రేమించలేదు. ఆమె నావస్తువు అనే భావాన్ని ప్రేమి స్తున్నారు – ఇప్పుడా భావన పోతుంది అంతే. అంత మాత్రాన విచారించ వలశిన పనేముంది.

వేణు : (ఆలోచించి) అంతేనంటారా ?–

రజని : ఇదిగో ఈ ప్రశ్న అందుకు నిదర్శన – నిజంగా ఆమెను ప్రేమించే వారయితే యీ ప్రశ్న అతనికి తప్పదు. మీ ఆత్మ బలంమీద మీకు నమ్మకం సన్నగిలడం వల్ల అడిగారు.

వేణు : అయితే నేనిప్పుడేం చేసేది ?

రజని : చేసేదేముంది ? నాలుగేళ్ళ క్రితం నేచేసినపనే. సాత్వికత లోంచి ప్రళయం పుట్టించ వచ్చు. అది నా అనుభవం నాకు నేర్పిన పాఠం. విచారించ నక్కర్లేదు. ఇప్పటికి రాణి నిజంగా తనను ప్రేమించగల వ్యక్తిని సంపాదిం చుకుంది. ఏమంటారు కుమార్ గారు ?

అరుణ: ఏదో తప్పు చేశానని పిస్తోంది.

రజని : తప్పు మీదికాదు. పరిస్థితులవి నిశ్చింతగా వెళ్ళిరండి

రాణి : (వెళ్తూ) నాకిక చెప్పాల్సిందేదీ లేదా ?_

రజని : నీకేం చెప్పను ?_ ఇలాంటి సంఘటన మరొకటి జరగకుండా చూడు. నీ జీవితానికీపాటి యౌవనం చాలు.

(ఇద్దరూ వెళ్ళిపోయారు.)

తెర

—: o :—